# శ్రీ గాయత్రీ మంత్రార్థము

(శ్రీ శ్రీ శ్రీమదాదిశంకరాచార్య భగవత్పాదుల
భాష్యమునకు స్వేచ్ఛానువాదము)

రచన
శ్రీ శ్రీ శ్రీ స్వామి చిన్మయానందులవారి ప్రముఖశిష్యులైన
శ్రీ బ్రహ్మచారి ప్రసన్నచైతన్య




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2000

**SRI GAYATRI MANTRARTHAMU**

By

**Sri Brahmachari Prasanna Chaitanya**



T.T.D. Religious Publications Series No. 295

| | | |
|---|---|---|
| T.T.D. First Edition | : | 1986 |
| First Re-print | : | 1996 |
| Second Re-print | : | 1997 |
| Third Re-print | : | 2000 |

Copies : 10,000



Published by

**Dr. I.V. Subba Rao,** I.A.S.,
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507.

Printed at

Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507.

''ముక్తా విద్రుమ హేమ నీల ధవళ
చ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తా మిందు నిబద్ధ రత్నమకుటాం
తత్త్వార్థవర్ణాత్మికామ్,
గాయత్రీం వరదాభయాంకుశ కశా
శ్శుభ్రం కపాలం గదాం
శంఖం చక్ర మథారవింద యుగళం
హస్తైర్వహంతీం భజే''.

# ముందుమాట

''న గాయత్ర్యాః పరం మంత్రం - నమాతుః పరదైవతం'' అన్నది ఆర్యోక్తి. మననాత్ త్రాయతే ఇతి మన్త్రః – అని వ్యుత్పత్తి. గాయత్రీ మంత్రానికి శబ్దపరంగానూ, మంత్రపరంగానూ ప్రత్యేకమైన స్థానం ఉంది. గాయత్రీ మంత్రోచ్చారణ వ్యక్తిలో గుప్తస్పందన కలుగజేసి వివిధ శక్తి కేంద్రాలకు చైతన్యాన్ని కలుగజేస్తుంది అన్నది మహర్షి ప్రోక్తం.

ఋగ్వేదంలోని ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు అగ్రగణ్యమైనది, విశిష్టమైనది. గాయత్రీ మంత్రంలో ఉన్న ఇరవైనాలుగు అక్షరాలలో ప్రతి ఒక్క అక్షరంలోనూ జ్ఞానము, శక్తి -నిక్షిప్తమై ఉన్నాయి. భారతీయ సంప్రదాయంలో సర్వసాత్త్వికోపాసకులు విధిగా అనుష్ఠించే ఉత్కృష్ట మంత్రమిది.

గాయత్రీ మంత్రం కేవలం పురుషులచేతనే అనుష్ఠింపబడవలెనని గాని, లేక నిర్ణయింపబడిన ఏకొద్దిమందిచేతనో అనుష్ఠింపబడవలెనని గాని శాస్త్రముల లోతులలో ఎక్కడా కానరాదు. దీనికి శాస్త్ర సమ్మతి లేదని తెలియజేస్తూ, అందరికీ అర్థమయ్యే విధంగా బ్రహ్మచారి ప్రసన్నచైతన్య కూర్చిన గాయత్రీ మంత్రార్థ వివరణ మిది. ఆదిశంకరాచార్యులు గాయత్రీ మంత్రానికి రచించిన భాష్యం ఈ రచన కాధారం.

ఈ పుస్తకపు గత ముద్రణల ప్రతులన్నీ పాఠకాదరపాత్రా లయ్యాయి. అందువల్ల ఈ పునర్ముద్రణను మీ ముందు ఉంచుతున్నాం. ఉపాసకులు ఇతోధికంగా వినియోగించుకొని ఉత్తమలబ్ధి పొందగలరని మా ఆశయం.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# ప్రార్థన

శ్రీ గురుస్తుతి :

శార్దూల విక్రీడితము :

శుత్యంతాంబుజ భాస్కరం శ్రితజనానందం బుధైస్సంస్తుతం
విజ్ఞానానలశుష్క మోహజలధింకారుణ్య పూర్ణాలయమ్
వాక్యార్థామృతవృష్టిదం సువిమలం ప్రాశస్త్యముద్రాలయం
మోక్షారామచరం భజే గురు మహం ప్రాసన్నహృత్తోషణమ్.

తామరసము-జగతీఛన్దస్సు :

శ్రుతివచనామృత బోధకరత్నం
శ్రితకరుణేక్షణ చిన్మయసాధుమ్,
శ్రుతిహృదయాప్త దయాఖ్యమపీఠం
విమలహృదా ద్వయమేవ భజేఽహమ్ ॥ 2

శ్రీ శారదా స్తుతి :

వేదమంత్రము :

ఓం ప్రణో దేవి సరస్వతీ
వాజేభి ర్వా జినీవతీ ।
ధీనామవిత్ర్యవతు ॥ 3

ఉల్లాసంబున నొక్కనాఁ డజుఁడు-రమ్యోద్యానమున్ జేరి నీ
సల్లాపంబుల నాలకించి మదిలో సంతోష మేపారఁగా
మెల్ల న్నిన్ హృదిఁజేర్చ నీ వొగి నజున్ మెప్పించుచున్ బాడఁగా
వల్లించెన్ బికమున్; వచింతు శుకమై వాక్యర్థముల్ శారదా . 4

శ్రీ విఘ్నేశ్వర స్తుతి :

వేదమంత్రము :

ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి ।
తన్నో దన్తీ ప్రచోదయాత్ ॥ 5

ఓంకారసత్స్వరూపం తం విఘ్నేశ్వర గజాననమ్ ।
నమస్కరోమి సద్భక్త్యా సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 6

ఇష్టదేవతా ప్రార్థనము :

వేదమంత్రములు :

ఓం మహాదేవ్యై చ విద్మహే
విష్ణుపత్న్యై చ ధీమహి ।
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥ 7

ఓం నారాయణాయ విద్మహే
వాసుదేవాయ ధీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥ 8

ఉపోద్ఘాతము :

శ్రీ గాయత్రీమంత్రార్థము వివరించుచు భగవాన్ శ్రీ మదాది శంకరాచార్య భగవత్పాదులవారు వ్రాసిన భాష్యగ్రంథము చాల అరుదైనది. అది యెక్కడ లభించునా యని నే ననేక సంవత్సరములనుండి యాలోచించుచుంటిని. 1976లో నొకమారు మా గురుదేవులైన శ్రీ స్వామి చిన్మయానందుల వారివద్దకు సోదర బ్రహ్మచారి బృందముతో నుత్తరకాశి వెళ్లుచుండగా మార్గమధ్యములో ఋషీకేశ్‌లో నొక మిత్రుఁడు నన్నుఁజూడవచ్చి తలవనితలంపుగా నీ భాష్యమును హిందీ యనువాదముతో నొసంగెను. అప్పటి నా యానందమునకు మేరయే లేదనవచ్చును. అటు పిమ్మట నాంగ్లములో మా గురువుగారు విరచించిన గాయత్రీ మంత్ర భాష్యవ్యాఖ్య చూచుట తటస్థించినది. అది మొదలు తెనుఁగులో దీనికి స్వేచ్ఛానువాదము వ్రాయవలెనను సంకల్పము నా మనస్సులో ప్రభవించి,

పరిఢవిల్లి, నేటికి పూవులఁజిగురుల వెలుఁగొందినది. ఫలముకూడ నిటులనే లభింపఁగలదను నాశతో నీ రచనకు పాల్పడుచున్నాఁడను. సహృదయులైన పాఠక సాధకవరులు సానుభూతితో నా యీ యత్నము నామోదించి, యిందేమైన రసమున్నయెడల నాస్వాదింతురు గాక !

ఇదియే నే నాశించు ఫలము.

"గాయత్రీ ఛన్దసా మహమ్" అని గీతావాక్యము. ఋగ్వేదములోగల ఛందస్సు లన్నిటిలో శ్రేష్ఠము, నగ్రగణ్యమునైనది గాయత్రీ ఛన్దస్సు. ఇది మహర్షు లంగీకరించిన సంప్రదాయము. శ్రేష్ఠత్వము జగత్తులో నెక్కడ గోచరించినను భగవంతుని విభూతియే యగునని శ్రీమద్భగవద్గీత యందలి విభూతియోగము యొక్క సారాంశము. అందువలన గాయత్రియే తానని శ్రీకృష్ణభగవానుఁడంగీకరించుటే పైనపేర్కొనఁబడిన గీతావాక్య మున కర్థము. "గాయత్ర్యాది ఛన్దోవిశిష్టానామ్ ఋచాం గాయత్రీఋక్ అహమ్ ఇత్యర్థః" అన్న శ్రీమదాదిశంకరాచార్యులభాష్యభాగమున కిదియే యర్థము.

"గాయనాత్ త్రాయతే ఇతి గాయత్రీ" అను వ్యుత్పత్తి గాయత్రీ శబ్దమునకుఁగలదు. దేనిని గానము చేయుటవలన అఁనగా జపించుటవలన దుఃఖసాగరమునుండి రక్షణ కలుగునో యదియే గాయత్రీ యనుట యీ వ్యుత్పత్తి యొక్క అర్థము.

"మననాత్ త్రాయతే ఇతి మన్త్రః" అనఁగా దేనిని మననము చేసి కొనుటవలన- అనఁగా పదేపదే మనస్సునం దర్థస్మరణతో జపించుట వలన సంసారతరణోపాయము లభించునో దానినే "మంత్ర" మందురు. ఈ విధ ముగా శబ్దపరముగాను, మంత్ర పరముగాఁగూడ శ్రీగాయత్రీమంత్రమునకు సాధనలో ప్రత్యేక స్థానముగలదు.

విశేష మేమనఁగా గాయత్రీ బీజమంత్రము. శబ్దబీజములైన యలౌకిక శబ్దములతో శబ్దబ్రహ్మ వేదమే శ్రీగాయత్రీ మహామంత్రము గాఁబట్టి యిది

2

బీజమంత్ర మగుచున్నది. ఆ శబ్దబ్రహ్మ మపౌరుషేయ మగుటవలన నమానుషశక్తి మత్త్వము గలిగియున్నది. ఈ విధముగాఁగూడ శ్రీగాయత్రీ మంత్రమునకు విశిష్టత్వము గలుగుచున్నది.

"జకారో జన్మవిచ్ఛేదః పకారో పాపనాశనః,
జన్మకర్మ హరో యస్మాత్ తస్మాజ్జప ఇతీర్యతే ."

'జప'మను శబ్దమందు 'జ'కారము జన్మవిచ్ఛేద సూచకము, 'పకారము' పాపనాశన సూచకము, 'జ'కారము 'ప'కారము కలిపి ఉచ్చరింపఁబడినచో 'జప'మను శబ్దము కలుగును. కావున 'జప' మను శబ్దము జన్మకర్మ హర ణోపాయమైన మోక్షమార్గమునకు సూచకము. అటువంటి జప ప్రక్రియ ఉపర్యుక్త విశిష్టగాయత్రీ మంత్రముతోఁగూడినదైనచో సంపూర్ణ ఫలసిద్ధి మిక్కిలి త్వరితగతి నెట్టి సాధకునకైనను గలిగించు ననుట నిర్వివాదాంశము.

అంతే కాదు-ఏ మంత్రమైన గురూపదిష్టమైనచో నది మహత్ఫలదాయక మగునని శాస్త్రహృదయము. ఈ గాయత్రీమంత్రము వేదమంత్రోచ్చారణ శోభితమై, శ్రౌతహోమాది సంపన్నమైన ఉపనయనసంస్కార మహత్సమ యమందు, కన్నతండ్రియే గురుస్థాన మధిరోహించి, పరంపరానుగతమై వంశవృక్ష మందెందరకో కొంగుబంగారమై యలరారిన మహత్పథమునందె సుతుని నడిపించుచు, నొసంగిన యుపదేశరూపము వహించుట, వర్ణనాతీత మహత్త్వప్రాపక మగుచున్నది.

ఇట్టి మహత్త్వమున కాలవాలమగు శ్రీగాయత్రీ మహామంత్రము, మరియు దీని యనుష్ఠానము, నేడు జనసామాన్యము యొక్క చిన్నచూపున కాస్కారమగుట విచారకరము. నిజానికి గాయత్రీమంత్రము కేవలము పురుషులచేతనే యనుష్ఠింపఁబడ వలెననిగాని, లేక కేవలము నిర్ణయింపఁ బడిన యే కొద్దిమంది చేతనో యనుష్ఠింపఁబడ వలెననిగాని, శాస్త్రముల లోతులలో నెక్కడ కానరాదు. మధ్యలో నేర్పడిన సాంఘికపరిణామా లలోఁగొంతకాలము క్రిందట నడ్డుగోడలు కొన్ని యేర్పడిన వనుట సత్య దూరము గాకపోయినను నేటి హేతువాదయుగములో వాటికి స్థానమూ

లేదు, మఱియూ శాస్త్రహృదయసమ్మతియూ లేదు. కావున గాయత్రీ మంత్ర యథార్థ స్వరూపమును గురించి హేతువాదబుద్ధిని విడనాడకుండా కూలంకషముగా నవగతము చేసికొనుట నేటి జనసామాన్యమునకు ప్రధాన కర్తవ్యమై యున్నది. అయితే యీ అవసరమును తీర్చే గ్రంథములు నేడు విరివిగా లభించుట లేదు. ఇట్టి సందర్భములో నీ రచనను చేపట్టి యథాశక్తి నీ కొఱఁత దీర్చుటకై యత్నించుచున్న నాకు సంపూర్ణ దైవసహకారము, సహృదయ పాఠకమహాశయ ప్రోత్సాహమూ కరతలామలకములై వరలుగాఁక యని కోరుకొనుచున్నాను.

ఇట్లు
సాధక విధేయుఁడు,
బ్రహ్మచారి ప్రసన్నచైతన్య.

ఓమ్

# శ్రీ గాయత్రీ మంత్రార్థము

ఓం ప్రణోదేవీ సరస్వతీ
వాజేభిర్వాజినీ వతీ ।
ధీనామవిత్ర్యవతు ॥

1. శ్రీగాయత్రీ మంత్రము :

ఓం భూర్భువస్సువః ।
తత్సవితుర్వరేణ్యం ।
భర్గో దేవస్య ధీమహి ।
ధియో యో నః ప్రచోదయాత్ ॥
ఓ మాపో జ్యోతీ రసోఽమృతం ।
బ్రహ్మభూర్భువ స్సువరోమ్ ॥

1. శ్రీ గాయత్రీ మంత్రములో గుర్తించవలసిన ముఖ్య విషయములు :
2. ఆదిమంగళము (ఉపక్రమము) :ఓం ।
3. ఆదివ్యాహృతులు :భూర్భువ స్సువః ।
4. ప్రథమపాదము : తత్సవితుర్వ రేణ్యం ।
5. ద్వితీయపాదము : భర్గో దేవస్య ధీమహి ।
6. తృతీయపాదము : ధి యో యోనః ప్రచోదయాత్ ।
7. మధ్యమంగళము, మఱియు చతుర్థపాదము (గాయత్రీ శిరస్సు)

ఓమాపో జ్యోతీ రసోఽమృతం ।

8. వాక్యశేషమూ, అంత్య వ్యాహృతులూ, మరియు నంత్యమంగళము (ఉపసంహారము) :

బ్రహ్మ భూర్భువ స్సువరోమ్ ॥

3. క) భాష్యము :

యః-సవితా దేవః, నః-అస్మాకం, ధియః-కర్మాణి ధర్మాది విషయా వా బుద్ధయః, ప్రచోదయాత్- ప్రేరయేత్, తత్-తస్య సర్వాసు శ్రుతిషు ప్రసిద్ధస్య, దేవస్య-ద్యోతమానస్య, సవితుః- సర్వాన్తర్యామితయా ప్రేరకస్య జగత్స్రష్టుః పరమేశ్వరస్య ఆత్మభూతం, వరేణ్యం- సర్వైరుపాస్యతయా జ్ఞేయ తయా చ సంభజనీయం, భర్గః-అవిద్యా తత్కార్యయోః భర్జనాత్ భర్గః, స్వయంజ్యోతిః పరబ్రహ్మాత్మక తేజః, ధీమహి-తత్ యః అహం, సః అసౌ, యః అసౌ, సః అహ మితి వయం ధ్యాయేమ.

ఖ) వివరణము :

శ్రీగాయత్రీమంత్రములోని మొదటి మూఁడు పాదములకుఁక్రింది విధముగా నర్థముఁ జెప్పుకొనవలెను.

యో (యః) = ఏ సవితృదేవత అనఁగా సర్వపుష్టియు, సర్వపోషణ కర్తృత్వము, సర్వప్రేరకత్వముఁ దనలోఁగల యే పరబ్రహ్మ సర్వరూపము, లేక ప్రత్యక్ష పరబ్రహ్మమైన ఏ సూర్య నారాయణ దేవుఁడు, నః= మనయొక్క, ధియో (ధియః) =ధర్మాది పరత్వముతోఁగూడిన బుద్ధులను లేక కర్మలను, ప్రచోదయాత్= ప్రేరేపించునో (సక్రమంగా నడిపించునో), తత్=అట్టి సర్వ వేదవేదాంత సుప్రసిద్ధుఁడైన, దేవస్య=ప్రకాశస్వరూపుఁడైన దేవునియొక్క, సవితుః=జీవుల కాత్మ (అంతరాత్మ) రూపములోనుండి సర్వాంతర్యామియై అందరినీ ధర్మమువైపు ప్రబోధించు ప్రేరకత్వము గలిగి

జగత్సృష్టి కర్తయైన పరమేశ్వరునియొక్క నిజస్వరూపమునకుఁ జెందిన వరేణ్యం=ధ్యానముచేతఁగాని, ఉపాసన చేతఁగాని, సర్వులచేత నను ష్ఠింపఁదగిన, లేక జ్ఞానముచే నెఱుఁగఁదగిన శ్రేష్ఠమైన భర్గః=అవిద్య, మఱియు దాని సంతతియైన కామ్యకర్మలనెడి పాశమును దహించి వేయు నట్టి ప్రకాశస్వరూపము లేక స్వయంజ్యోతిర్మైన పరబ్రహ్మముయొక్క తేజః పుంజము, ధీమహి= ఆ తేజః పుంజము నేనే అనియూ, మఱియు 'నేను' అని సూచింపఁబడుచున్నవ్యక్తి పరబ్రహ్మమైన సవితృదేవతకంటె వేఱుగాఁడనియూ మేము ధ్యానింతుము గాఁక.

4. క) భాష్యము :

యద్వా తదితి భర్గో విశేషణం సవితుః దేవస్య తత్ తాదృశం భర్గః ధీమహి కిం తత్ ఇతి అపేక్షాయామ్ ఆహ-యః ఇతి లింగవ్యత్యయః, యద్భర్గః ధియః ప్రచోదయాత్ ఇతి తత్ ధ్యాయేమ ఇతి సమన్వయః ॥

ఖ) వివరణము :

ఇంకొక విధముగా నర్థముఁజెప్పకొనవలె నన్నచోఁ గ్రిందివిధ ముగాఁజెప్పకొనవలెను.

శ్రీ గాయత్రీమంత్రములోని "తత్" అనే పదము 'భర్గో (భర్గః)' అనే పదమునకు విశేషణము; అనఁగా 'తత్' పదమునకు 'ఆ రకమైన (భర్గః, తేజఃపుంజము)' అని అర్థము. అంటే '( సవితృదేవతయొక్క) ఆ విధమైన (తేజఃపుంజము)' అని అర్థము. 'ఏ విధమైన తేజఃపుంజము?' అని ప్రశ్న వేసికొంటె, 'నః ధియో (ధియః) యః (యో) ప్రచోదయాత్' అని అన్వయించుకొనవలెను అంటె 'ఏ విధమైన తేజోరాశి మన ధార్మిక బుద్ధులను లేక తదనుగుణములైన కర్మలను ప్రేరేపించునో, ఆ విధమైన తేజఃపుంజము' అని అర్థము.

- ఇక్కడ వైయాకరణులైన పాఠకమహాశయులకు యః (యో) అను పదములో 'లింగవ్యత్యాసము' గోచరించును--ఎందుకంటే భర్గో (భర్గః)

అను పదము సంస్కృతములో నపుంసక లింగమునకుఁ జెందినది కాఁబట్టి, దానిని సూచించు పదము 'యత్' అని నపుంసక లింగములో నుండవలసి యున్ననూ, ఇక్కడ 'యః (యో)' అని పుంలింగ పదము వాడఁబడినది. దీనినే "లింగవ్యత్యాస" మని యందురు. ఇది సాధారణముగా దోషముగా పరిగణింపఁబడును. - నిజమే, ఇక్కడ లింగవ్యత్యాస మున్నది; గాని అది ఈ సందర్భములో దోషము గాదనుట శాస్త్రసమ్మతము. ముఖ్యముగా నుత్తర మీమాంసాశాస్త్ర సమ్మతము. ఏలాగంటే - ఇక్కడ లింగవ్యత్యాస మొకానొక సాంకేతిక ప్రయోగము. 'భర్గః' అను శబ్దము నిర్గుణ పరబ్రహ్మతత్త్వమును సూచించును. నిర్గుణపరబ్రహ్మతత్త్వము సాధారణముగా నపుంసకలింగములో సూచింపఁబడుట ఆచారము. అందుచేత "భర్గః" అను నపుంసకశబ్దము, స్వయంజ్యోతి స్స్వరూపమైన నిర్గుణ పరబ్రహ్మమును సూచించును. అదే నిర్గుణ పరబ్రహ్మము, కల్పిత లౌకిక దృష్టిలో ప్రేరకత్వముఁగలిగి యున్నప్పుడు "భగవంతుఁ"డనియూ, లేక "పరమేశ్వరుఁ'డనియూ సూచింపఁబడును. ఆ పరమేశ్వరుఁడే "పురుషుఁ"డని కూడా పుంలింగములో సూచింపఁబడుట సంప్రదాయము. ఇక్కడ 'యః (యో)' శబ్దము ప్రేరకార్థములో నీ 'పురుషుని' సూచించును. "పురుష", "పరబ్రహ్మము"లలో నిజమైన తేడా లేదు గాఁబట్టి లింగవ్యత్యాస మిక్కడ నీ విధముగా భూషణప్రాయమైన సాంకేతిక ప్రయోగమే యగును గాని దూషణము గానేరదు.

ఈ విధమైన అర్థములో సంపూర్ణమైన అన్వయ మే మన్నచో--

"సవితృదేవత యొక్క ఏ విధమైన తేజఃపుంజము మన ధార్మిక బుద్ధులను లేక తదనుగుణములైన కర్మలను ప్రేరేపించునో, ఆ విధమైన తేజఃపుంజము నేనే అనియూ, లేక "నేను" అను పదముచే సూచింపఁబడు వ్యక్తి ఆ రకమైన తేజఃపుంజము రూపములో నున్న పరబ్రహ్మము కంటె వేఱుగాఁ డనియూ మేము ధ్యానింతుము గాక" అని చెప్పుకొనవలెను.

5. క) భాష్యము :

యద్వా-యః సవితా-సూర్యః, ధియః-కర్మాణి, ప్రచోదయాత్-ప్రేర యతి, సః తస్య సవితుః-సర్వస్య ప్రసవితుః దేవస్య - ద్యోతమానస్య సూర్యస్య, తత్-సర్వైః దృశ్యతయా ప్రసిద్ధం, వరేణ్యం-సర్వైః సంభజ నీయం, భర్గః-పాపానాం తాపక తేజోమణ్డలం, ధీమహి-ధ్యాయేమ, మనసా ధారయేమ.

ఖ) వివరణము :

ఇంకొక యర్థ మేమనఁగా- 'యః(యో)' ఏ సవితా (సవితృదేవత) అనఁగా సూర్యుఁడు, ధియః=సర్వకర్మలను, ప్రచోదయాత్=ప్రేరేపించు చున్నాఁడో, సః=ఆ సూర్యుఁడు. తస్య సవితుః=ఆ సర్వప్రసవనకర్త యొక్క, అనఁగా సర్వము నుత్పత్తి యగుటకుఁగాని, ప్రసార మగుటకుగాని, మూలకారణమైన ఆ సూర్యభగవానుని యొక్క, దేవస్య=ప్రకాశయుక్తుఁడైన ఆ సూర్యనారాయణమూర్తి యొక్క, తత్=సర్వులకు ప్రత్యక్షగోచరమగు చున్న ఆ, వరేణ్యం=సర్వులచేతను ఆరాధనీయమైన లేక ఉపాసితవ్యమైన లేక బాగుగా భజనీయమై శ్రేష్ఠమైన, భర్గః (భర్గో)=సర్వపాపములను హరించునట్టి లేక సర్వదోషములను హరించునట్టి, లేక సమస్తదుష్ట భావ నలనూ, అహంకారమునూ అంతము చేయునట్టి, తేజోమండలము, లేక చండమార్తాండ స్వరూపము, ధీమహి=మేముఁసంపూర్ణమైన మనస్సుతో జ్ఞానముతోఁగూడ నిశ్చలముగా ధ్యానింతుము గాక.

6. క) భాష్యము :

యద్వా, భర్గః శబ్దేన అత్ర అన్నమ్ అభిధీయతే, యః సవితా దేవః ధియః ప్రచోదయతి తస్య ప్రసాదాత్ భర్గః అన్నాది లక్షణం ఫలం ధీమహి ధారయామః తస్య ఆధారభూతాః భవేమ ఇత్యర్థః.

ఖ) వివరణము :

ఇంకొక యర్థ మీ క్రిందివిధముగాఁజెప్పఁకొనవచ్చును :

ఇచ్చట 'భర్గో (భర్గః)' అను పదమునకు 'అన్నము' అనఁగా వరి మొదలగు నవధాన్యములు, మఱియు నితరములగు పప్పుదినుసులు, అను అర్థము వర్తించును. యః సవితా దేవః=ఏసవితృదేవత, అనఁగా సూర్య నారాయణమూర్తి లేక పరమేశ్వరుఁడు, ధియః ప్రచోదయతి=మన యొక్క సర్వకర్మలను, లేక ధార్మికబుద్ధులను, తదనుగుణములైన కర్మలను, ప్రేరేపించునో, తస్య=ఆ దేవుని యొక్క, ప్రసాదాత్=కరుణచేత, లేక అనుకూల్యముచేత, లేక అనుగ్రహముచేత, భర్గః='అన్నాది' అనఁగా నాహారధాన్యములైన వరి మొదలగు నవధాన్యములు, మిగతా వాణిజ్యపు పంటల దినుసులు, మొదలగువాని రూపములో నున్న ప్రకాశవంతమైన మహత్ఫలము, ధీమహి=మేము సంపూర్ణముగాఁబొందెదముగాక- (అందుకొఱకు జ్ఞానముతోఁగూడిన మనస్సుతో నిశ్చలముగా ధ్యానించి తలఁపులందా దేవుని సుప్రసన్నుని లేక సుస్థిరుని చేసికొందము గాక) అని యర్థము.

ఇంతవరకు మనము చెప్పుకొన్న శ్రీగాయత్రీ మహామంత్రము యొక్క వినియోగము 'నిదిధ్యాసనము'లో నుండును అనఁగా జీవన్ముక్తి కొఱకు సాధకులు 'శ్రవణము', 'మననము' చేసిన తర్వాత జ్ఞాననిష్ఠకై చేయు 'నిదిధ్యాసనము' (ఒకవిధమైన ధ్యానము) కొఱకు పైనఁజెప్పఁబడిన శ్రీగాయత్రీ మహామంత్ర ముపయోగపడును.

ఇతర సాధకులకు శ్రీగాయత్రీ మహామంత్ర మెట్లుపయోగించునన్నచో.

### 7. క) భాష్యము :

అథ సర్వదేవాత్మనః సర్వశక్తేః సర్వావభాసక తేజో మయస్య పరమాత్మనః సర్వాత్మకత్వ ప్రతిపాదక గాయత్రీ మహామన్త్రస్య ఉపాసనాప్రకారః ప్రకాశ్యతే-తత్ర గాయత్రీం ప్రణవాది సప్తవ్యాహృత్యుపేతాం. శిరఃసమేతాం సర్వవేద సారమితి వదన్తి. ఏవం విశిష్టా గాయత్రీ ప్రాణాయామైః ఉపాస్యా।

### ఖ) వివరణము :

ఇంక సర్వదేవతలకు, అనఁగా సర్వేంద్రియములే సర్వదేవతలని యొక యర్థమున్నది గాఁబట్టి సర్వేంద్రియముల వెనుక వానికి శక్తి నిచ్చునట్టి యేకైక యాత్మస్వరూపమై సమస్తములైన శక్తులతోను, సర్వమును ప్రకాశింపఁజేయు తేజఃస్వరూపము తోను వెలుఁగొందు పరమాత్ముని సర్వాత్మకత్వమునే

బోధించు శ్రీగాయత్రీమహామన్త్రము యొక్క పైనఁజెప్పఁబడిన యర్థమును తమ జ్ఞాననిష్ఠకొఱకు చేయఁబడు 'నిదిధ్యాసనము'లో చూచుకొనలేని సాధకు లట్టి యోగ్యతను తమ యుపాసనాది సాధనలద్వారా సంపాదించుకొనవలెనను సందేశము వ్యక్తముఁజేయుచు, లేక యట్టి వార లుపాసనద్వారా కనీసము కాలాంతరక్రమ ముక్తినైనా పొందవలెనను సదుద్దేశము సూచించుచు, నట్టి సాధకుల కుపయుక్తమగు శ్రీగాయత్రీ మహామన్త్రము యొక్క ఉపాసనాప్రకార మిప్పఁడు చెప్పఁబడుచున్నది.

ఉపాసన కుపయుక్తమగు గాయత్రీ మహామన్త్రములో గ్రింది విధముగా మూఁడు ముఖ్యవిభాగములు గలవు.

1. ప్రణవాదిసప్త వ్యాహృతులు :

అనఁగా ప్రతివ్యాహృతియు నోంకారముతో మొదలైనచో నట్లేర్పడిన యేడు వ్యాహృతులు.

ఓం భూః ఓం భువః
ఓగ్ం సువః ఓం మహః
ఓం జనః ఓం తపః
ఓగ్ం సత్యమ్

2. ప్రణవాదిచతుర్వింశత్యక్షర గాయత్రి :

అనఁగా నోంకారముతో మొదలై 24 అక్షరములతోనున్న మూఁడు పాదముల గాయత్రి.

ఓం తత్సవితు ర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్

3. ప్రణవాది వాక్యశేషాన్తగాయత్రీ శిరస్సు :

అనఁగా నోంకారముతో మొదలై 'బ్రహ్మ' అను వాక్యశేషముతోను, త్రివ్యాహృతులతోను, ప్రణవముతోనూ అంతమైన శ్రీగాయత్రి యొక్క నాల్గవపాదము.

ఓమాపో జ్యోతీ
రసోఽమృతం బ్రహ్మ
భూ ర్భువ స్సువ రోమ్

పైనఁజెప్పఁబడినట్లుగా మూఁడు విభాగములతో నేర్పడిన శ్రీగాయత్రీ మహామంత్రము సర్వవేదసారమని జ్ఞానులు (పండితులు) వచింతురు. దీనినే 'ఉపాసనాగాయత్రీ మంత్రము' లేక 'ప్రాణాయామ గాయత్రీ మంత్రము' అందురు. దీని వినియోగము ప్రాణాయామ విధానములందు గలదు. మన పూజావిధానములో కూడా సంకల్పము చెప్పునపు డీ ప్రాణాయామ గాయత్రీ మంత్ర ముచ్చరిపఁబడును.

ఇఁక జపమున కుపయోగించు 'శుద్ధగాయత్రీ మహా మంత్రము' గూర్చి.

8. క) భాష్యము :

సప్రణవ వ్యాహృతిత్రయోపేతా, ప్రణవాన్తా, గాయత్రీ జపాదిభిః ఉపాస్యా. తత్ర శుద్ధా గాయత్రీ ప్రత్యగ్ బ్రహ్మైక్య ప్రబోధికా ధియో యో నః ప్రచోదయాదితి- నః అస్మాకం ధియః బుద్ధియః యః ప్రచోదయాత్ ప్రేరయేత్ ఇతి సర్వ బుద్ధి సంజ్ఞాఽన్తఃకరణ ప్రకాశక సర్వసాక్షీ ప్రత్యగాత్మా ఇతి ఉచ్యతే, తస్య ప్రచోదయాచ్ఛబ్దనిర్దిష్టస్య ఆత్మనః స్వరూప భూతం పరం బ్రహ్మ తత్సవితుః ఇత్యాది పదైః నిర్దిశ్యతే. తత్ర ఓం తత్ సత్ ఇతి నిర్దేశః బ్రహ్మణః త్రివిధః స్మృతః ఇతి తత్ శబ్దేన ప్రత్యగ్ భూతస్వతఃసిద్ధం పరం బ్రహ్మ ఉచ్యతే. సవితుః ఇతి సృష్టిస్థితి లయలక్షణకస్య సర్వప్రపఞ్చస్య

సమస్తద్వైతవిభ్రమస్య అధిష్ఠానం లక్ష్యతే. వరేణ్యం ఇతి సర్వవరణీయం నిరతిశయానన్ద రూపం భర్గః ఇతి అవిద్యాదోషభర్జనాత్మక జ్ఞానైక విషయత్వం దేవస్య ఇతి సర్వద్యోతనాత్మక అఖండ సదేకరసం సవితుః దేవస్య ఇతి అత్ర షష్ఠ్యర్థః రాహోః శిరోవత్ ఔపచారికః. బుద్ధ్యాది సర్వదృశ్యసాక్షిలక్షణం యస్మే స్వరూపం తత్ సర్వాధిష్ఠానభూతం పరమానన్దం నిరస్త సమస్తానర్థరూపం స్వప్రకాశచిదాత్మకం బ్రహ్మ ఇతి ఏవం ధీమహి ధ్యాయేమ.

ఏవం సతి సహ బ్రహ్మణా (హిరణ్యగర్భేన సహ) స్వవి వర్తజడ ప్రపఞ్చేన సహ రజ్జుసర్పన్యాయేన అపవాద సామానాధి కరణ్య రూపైకత్వ న్యాయేన సర్వసాక్షిప్రత్యగాత్మనః బ్రహ్మణాసహ తాదాత్మ్యరూప మేకత్వం భవతి ఇతి సర్వాత్మక బ్రహ్మ బోధకః అయం గాయత్రీమంత్రః సంపద్యతే.

ఖ) వివరణము :

ఇంత వరకు నుపాసకుల యొక్కయు, ప్రాణాయామ పరుల యొక్కయు వినియోగము కొఱకై 'యుపాసనా గాయత్రీ మంత్రము' లేక 'ప్రాణాయామ గాయత్రీ మంత్రము' చెప్పఁబడినది. ఇంకను ఉపాసకులు గూడ వారి సాధన 'జపము' రూపములోగాని, 'సామాన్యధ్యానము' లేక 'విరాళ ధ్యానము' రూపములోగాని, యుండును గాఁబట్టి, జపము చేయు వారి యొక్కయు, మఱియు (విరళ) ధ్యానము చేయువారి యొక్కయు వినియోగార్థము శ్రీగాయత్రీ మహామంత్ర మే రూపములో నుండునో, మఱియు దానికెట్టి ప్రత్యేక వినియోగములో నే పేరు గలదో యిప్పుడు వివరింపఁబడుచున్నది.

'జపము' లేక '(విరళ) ధ్యానము'న కుపయుక్తమగు శ్రీగాయత్రీ మహామంత్రమును 'శుద్ధగాయత్రీమంత్ర'మని యందురు. దాని రూపముక్రింది విధముగా నుండును.

1. సప్రణవవ్యాహృతిత్రయః :

అనఁగా నోంకారము మొదటఁగలిగిన మొదటి మూఁడు వ్యాహృతులు.

ఓం భూర్భువస్సువః

2. చతుర్వింశత్యక్షరా త్రిపదా గాయత్రీ :

అనగా 24 అక్షరములతో నున్న మూఁడు పాదముల గాయత్రి.

తత్సవితు ర్వరేణ్యం భర్గో
దేవస్య ధీమహి ధియో యో నః
ప్రచోదయాత్

3. అంత్యప్రణవము :

అనఁగా చివరన మంగళముకొఱకు మఱియు నుపసంహారముగాఁజెప్పఁబడిన ఓంకారము.

"ఓం"

ఈ 'శుద్ధగాయత్రీ మంత్రము'లో సామాన్యసాధకుల కర్థమగునట్టులు, లేక సామాన్యసాధకుల లక్ష్యమును వివరించునట్టులు ప్రత్యేకమైన అర్థమేమైనను గలదా? - అని ప్రశ్నించినచో దిగువవిధముగా సమాధానము చెప్పఁబడుచున్నది.

ఈ 'శుద్ధగాయత్రీ మంత్రము' సామాన్యసాధకుఁడు చేరవలసిన అంతిమ గమ్యమును బోధించుచున్నది. ఆ అంతిమ గమ్యమే 'ప్రత్యగ్ బ్రహ్మైక్య' మనఁబడును. 'ప్రత్యక్' అనఁగా ప్రతిజీవుఁడు 'నేను' అనే పదముతో సూచించు వ్యక్తి. అదియే 'ఆత్మ' లేక 'జీవాత్మ' యనఁబడును. 'బ్రహ్మ' అనఁగా లౌకిక దృష్టిలో సమస్త భువనస్వరూపుఁడై స్థూలదృష్టిలో చరాచరము లన్నింటిని తన స్థూలశరీరములో నిముడ్చుకొని విరాట్ స్వరూపుఁడై యున్న హిరణ్యగర్భునియొక్క అనఁగా పరమేశ్వరుని యొక్క యథార్థమైన నిర్గుణస్వరూపము. దీనినే 'పరబ్రహ్మము' లేక 'పరమాత్మ' యందురు. ఈ 'జీవాత్మ' 'పరమాత్మ'లు వేఱ్వేఱు పదార్థములు గావు, రెండును ఒకే ఒక వస్తువు - అనఁగా రెండునుకూడ

ఒకే భగవంతుని యొక్క రెండు పేర్లు ఒకటి కల్పితము, రెండవది యథార్థము. ఈ విధముగాఁదెలిసికొన్నచో నా జ్ఞానమునే 'ప్రత్యగ్ బ్రహ్మైక్య' మందురు. ఈ 'శుద్ధగాయత్రీ మంత్రము' సాధకుల యంతిమలక్ష్యమైన యీ 'ప్రత్యగ్ బ్రహ్మైక్యము' నే బోధించుచున్నది. ఇది ముఖ్యముగా నందఱు సాధకులు మొట్ట మొదట గుర్తించవలసిన విషయము. ఈ గుర్తింపే 'శుద్ధగాయత్రీ మంత్రము' యొక్క ముఖ్యప్రయోజనము. శ్రీమదాదిశంకరాచార్యుల వారొసఁగిన యీ అర్థమువల్లనే మంత్రములలో సాధన ప్రధానమైన 'శుద్ధగాయత్రీ మంత్రము' నయిదవ మహావాక్యముగాఁగూడ పరిగణింపవచ్చును.

అయిదవ మహావాక్యముగా నీ 'శుద్ధగాయత్రీ మంత్రము' యొక్క యర్థముఁదెలిసికొన కుతూహలపడు పాఠకమహాశయుల కొఱకే క్రింది విధముగా శ్రీమదాదిశంకరాచార్య భగవత్పాదులు చెప్పిరి.

ఈ 'శుద్ధగాయత్రీ మంత్రము'లో 'ధియో యో నః ప్రచోదయాత్' అను భాగము 'తత్త్వమసి' మహావాక్యములో 'త్వం' పదమువలె 'ప్రత్యగాత్మ'ను అనఁగా 'జీవాత్మ'ను బోధించుచున్నది. 'తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య' అను భాగము 'తత్త్వమసి' మహావాక్యములో 'తత్' పదమువలె 'ప్రత్యగాత్మ' యొక్క యభిన్న స్వరూప మనఁబడు 'పరబ్రహ్మము'ను అనఁగా 'పరమాత్మ'ను బోధించుచున్నది. 'ధీమహి' అనుపదము 'తత్త్వమసి' మహావాక్యములో 'అసి' పదమువలె 'ప్రత్యగ్ బ్రహ్మైక్యము'ను అనఁగా 'జీవాత్మ', 'పరమాత్మ'ల ఏకత్వమును ధ్యానవస్తువుగా బోధించుచున్నది. ఈ విధముగా నీ 'శుద్ధగాయత్రీ మంత్రము' మహావాక్యములలో మొట్టమొదటి 'యుపదేశ మహావాక్య' మైన తత్త్వమసి. అను మహావాక్యమువలె గొప్ప మహావాక్యమగుచున్నది. అందుకే దీనిని అయిదవ మహావాక్యమనియు, సాధనమహావాక్యమనియు పేర్కొనవచ్చును. (మహావాక్యములు ముఖ్యముగా నాలుగు. 1) ఉపదేశమహావాక్యము 'తత్త్వమసి' (సామవేదము) 2) అనుభవమహావాక్యము. 'అహంబ్రహ్మాస్మి' (యజుర్వేదము,) 3) నిర్దేశమహావాక్యము.

'ప్రజ్ఞానం బ్రహ్మ' (ఋగ్వేదము), 4) నిరూపణమహావాక్యము, 'అయ మాత్మాబ్రహ్మ, (అథర్వణ వేదము)].

ఇందు మొదటిభాగమైన 'ధియో యో నః ప్రచోదయాత్' యొక్క ప్రతిపదార్థ మీ క్రింది విధముగా తెలియవలెను.

నః - అనఁగా మనయొక్క, ధియో (ధియః) - అనఁగా బుద్ధులను (నిశ్చయరూపములైన ఆలోచనలను) యో (యః) - అనఁగా ఏ 'ప్రత్యగాత్మ' లేక 'జీవాత్మ' ప్రచోదయాత్ - ప్రేరేపించుచున్నదో (అంటే - మనలో సర్వవిధముల నిశ్చయాత్మకములైన ఆలోచనలను కల్పించునట్టి యంత్రాంగము 'బుద్ధి' లేక 'అంతఃకరణ' మనఁబడును. ఈ 'బుద్ధి'కి ఉపలక్షణముగా 'మనస్సు' ఉండును - అంటే ఈ 'బుద్ధి'లోనే ఒక శాఖగా 'మనస్సు' పనిచేయుచున్నది. 'సంకల్ప వికల్పములు' గల శాఖను 'మన'స్సనియు, 'నిశ్చయములు' గల ప్రధానశాఖను 'బుద్ధి' అనియు అందురు. మామూలుగా చెప్పుకొన్నప్పుడీ రెండుశాఖలూ కలిసి 'యంతఃకరణ' మనఁబడును. ఇందులో 'బుద్ధి' ప్రధానశాఖ గాఁబట్టి కొన్ని విశేషసందర్భములలో 'బుద్ధి'నే 'అంతఃకరణ' మందుము. ఇక్కడ 'బుద్ధి'నే 'అంతఃకరణ' మనుచున్నాము. అంటే 'మనస్సు'ను వదలివేసినట్లు కాదని గుర్తుంచుకొనవలెను. ఈ 'అంతఃకరణము' యొక్క ఉనికియు జరుగుబాటు కూడా దీనికి సాక్షిగా దీనిలోనే వ్యాపించియుండి, దీనిని, దీని ఆలోచనలను ప్రకాశింపఁజేయు వస్తువు 'ప్రత్యగాత్మ' లేక 'జీవాత్మ' యని మనము మఱచిపోకూడదు. ఎందుకంటే సూర్యుఁడే లేకపోయిన ఆ సూర్యునిఁగప్పుచ్చు మేఘము కనఁబడకుండునట్లు, 'జీవాత్మ' లేనిదే ఆలోచనలతో నిండి జీవాత్మను కప్పిపుచ్చునట్టి 'యంతఃకరణము'న కునికి గాని, జరుగుబాటు గాని యుండవు. అందువలన బుద్ధి ప్రధానమైన యంతఃకరణమునకు సాక్షియు, దానిని నడిపించునట్టి లేక ప్రేరేపించునట్టి ప్రేరకవ్యక్తియు 'ప్రత్యగాత్మ'యే అనఁగా 'జీవాత్మ'యే యగుచున్నది. అట్టియే జీవాత్మ మనబుద్ధులను నడపించుచున్నదో, అని ఇక్కడ యర్థము.

రెండవభాగమైన 'తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య'లో 'తత్'అను పద మీ 'జీవాత్మయే', 'పరమాత్మ' లేక పరబ్రహ్మ అని సూచించుచున్నది. ఎందుకంటే శ్రీమద్ భగవద్గీతలో "ఓం తత్, సత్" అను మూఁడు మాటలు ప్రత్యగాత్మయు, 'స్వతః సిద్ధము' అయిన పరబ్రహ్మమునే సూచిం చునని చెప్పఁబడినది. ఈ విధముగా నిక్కడ 'తత్' (తస్య) - అనఁగా 'నా జీవాత్మ రూపములో నున్న పరబ్రహ్మము యొక్క లేక పరమాత్మ యొక్క' అని యర్థము. 'సవితుః' - అనఁగా 'సృష్టి స్థితి లయము లతో నొప్పుచుఁగల్పితములై కలలుగాఁ గనిపించు సర్వద్వైతవ్యాపారములకుఁ బుట్టినిల్లైన యీ ప్రపంచమంతటికి సర్పమునకు నధిష్ఠానమైన రజ్జువు వలె అధిష్ఠానముగా నున్న సవితృ దేవతయొక్క లేక పరబ్రహ్మము యొక్క అని అర్థము. 'వరేణ్యం' - అనఁగా 'నెల్లరకూ కావలసిన, మఱియు నంతులేక యెల్లప్పుడు ఒకే రూపములో సంపూర్ణముగా నుండెడి నిరతిశయానందరూపములో నున్న' యని యర్థము. 'భర్గో (భర్గః) - అనఁగా' అవిద్యా, కామ్య, కర్మలనెడి అవిద్యాగ్రంథిని దహించివేయు సామర్థ్యముతో నొప్పుచున్న 'కేవల చిత్స్వరూపము' అని అర్థము. 'దేవస్య' - అనఁగా 'సర్వమును ప్రకాశింపఁజేయునట్టి అధిష్ఠానమైన ఏకైక సత్స్వ రూపమైన సవితృదేవత యొక్క లేక ప్రత్యగ్ బ్రహ్మయొక్క' అని అర్థము. (- ఇక్కడొక సందేహము కలుగ వచ్చును - ఏకైక సత్స్వరూప మన్నారు గదా, 'ఆ సత్స్వరూపమైన సవితృదేవతయొక్క' అంటారేమిటి? ఏక సత్స్వరూపములో ద్వైత మెట్లు కల్పిస్తున్నారు? అన్నదే ఈ సందేహం. దీనికి సమాధానం ఏమంటే ఇక్కడ, 'యొక్క' అను ప్రయోగమును 'ఔపచారిక ప్రయోగ మంటారు' - అంటే ఇది మాటవరుస కన్నదే గాని నిజముగాదని అర్థము. ఏలాగంటే 'రాహువు యొక్క శిరస్సు' అన్నా మనుకోండి. రాహువంటేనే శిరస్సు కదా! అప్పుడు రాహువు యొక్క శిరస్సేమిటి? - అంటే ఇక్కడ మాటవరుసకు 'రాహువు యొక్క శిర' స్సని అన్నాము గాని నిజముగా కాదన్నమాట. అలాగే మన 'దేవస్య' సత్స్వరూపమైన సవితృదేవత యొక్క అను ప్రయోగమని తెలిసి కొందుము గాక.) 'ధీమహి' - అనఁగా 'మన బుద్ధి మొదలగు నట్టి యంతఃకరణ వికారములను, చేష్టలను, ప్రేరే

పించుచు, దృశ్యములైన మన మనోవృత్తు లన్నిటికి సాక్షియు, నధిష్ఠానమై, ఏకైక సచ్చిదానంద రూపములో నున్న మన ప్రత్యక్ స్వరూపము లేక ప్రత్యగాత్మ లేక జీవాత్మ సర్వప్రపంచమునకు యధిష్ఠానమై, సదేకరసమై పరమానంద స్వరూపములో నున్న స్వయంజ్యోతియై, స్వప్రకాశ చిద్ఘనమై, సమస్తానర్థము లనెడి మంచుతెరలకు చండమార్తాండ స్వరూపమైన పర బ్రహ్మమేగాని లేక పరమాత్మయేగాని వేఱుగాదని ధ్యానింతుము గాక (అనఁగా తెలిసికొందుము గాక) అని యర్థము.

ఇంతవఱకు సరళమైనభాషలో 'శుద్ధగాయత్రీ మంత్రము'న కర్థము చెప్పుకొంటిమి. ఇంక శాస్త్రీయమైన పద్ధతిలో సాంకేతిక శబ్దజాలముతో నీ 'శుద్ధగాయత్రీ మంత్రము' యొక్క అర్థము చెప్పఁబడవలెనన్నచో-

"రజ్జు సర్ప న్యాయములో రజ్జువునకు, సర్పమునకు ఏ విధముగా బాధసామానాధికరణ్యము గలదో, మఱియు శుక్తికా రజత న్యాయములో శుక్తికకు, రజతమునకు, ఏ విధముగా నపవాద సామానాధికరణ్యము గలదో, అదేవిధముగా హిరణ్యగర్భునితో సహ సర్వప్రపంచమునకు వివర్తకారణమైన పరబ్రహ్మమునకు అంతఃకరణ వృత్తులకు సాక్షియైన జీవాత్మకు, తాదాత్మ్య రూపమైన ఏకత్వము గలదని యీ విధముగా ప్రత్యగ్ బ్రహ్మైక్యమును సూచించుచు, అట్టియేకైక సచ్చిదానంద స్వరూపమైన ప్రత్యగ్ బ్రహ్మయే ధ్యేయ విజ్ఞేయ వస్తువని బోధించుటే 'శుద్ధగాయత్రీ మంత్రము' యొక్క పరమార్థమై యున్నది" అని చెప్పుకొనవలెను.

ఇఁక 'సప్తవ్యాహృతులు' అనఁగా ఏడు వ్యాహృతులున్నవని చెప్పుకొ న్నాము గదా - వాని యర్థము లే వన్నచో -

## 9. క) భాష్యము :

సప్త వ్యాహృతీనామ్ అయ మర్థః - 'భూః' ఇతి సన్మాత్రముచ్యతే। 'భువః' ఇతి సర్వం భావం ప్రకాశయతీతి వ్యుత్పత్త్యా చిద్రూపముచ్యతే। 'సువర్' ఇతి సుప్రియతే ఇతి వ్యుత్పత్త్యాసువః ఇతి, సుష్ఠు సర్వైః ప్రియ మాణః సుఖస్వరూప ముచ్యతే। 'మహః' ఇతి మహీయతే పూజ్యతే ఇతి

వ్యుత్పత్త్యా సర్వాతి శయత్వముచ్యతే! 'జనః' ఇతి జనయతీతి జన సకల కారణత్వముచ్యతే! 'తపః' ఇతి సర్వతేజో రూపత్వమ్, 'సత్యమ్' ఇతి సర్వ బాధా రహితమ్ ।

ఏతదుక్తం భవతి - లోకే స్వరూపం తదోంకార వాచ్యం బ్రహ్మైవ ఆత్మనః అస్య సచ్చిద్రూప స్వభావాదితి. అథ భూరాదయః సర్వే లోకాః ఓంకారవాచ్యాః బ్రహ్మాత్మకాః న తద్వ్యతిరిక్తం కించి దస్తీతి వ్యాహృతయః సర్వాత్మక బ్రహ్మబోధికాః ।

ఖ) వివరణము :

'ప్రాణాయామ గాయత్రీ మంత్రము'లోఁగ్రింద నీయఁబడిన 'ప్రణ వాది సప్తవ్యాహృతులు' మొదట్లో యున్నవని మనము గమనించి యున్నాము

ప్రణవాది సప్తవ్యాహృతులు - అనఁగా ప్రతివ్యాహృతియు నోంకార ముతో మొదలైనచో నట్లేర్పడిన యేడు వ్యాహృతులు.

ఓం భూః । ఓం భువః । ఓగ్ం సువః ।

ఓం మహః । ఓం జనః । ఓం తపః ।

ఓగ్ం సత్యమ్ ।

పై సప్తవ్యాహృతులలో ప్రతి వ్యాహృతియొక్క అర్థము, మఱియు నీ వ్యాహృతు లోంకారముతో కలిసి యేల నుచ్చరింపఁబడుచున్న వను విష యము ఇప్పుడు చెప్పఁబడుచున్నవి. భూః అనఁగా నిది పరబ్రహ్మముకంటె వేఱుగాని ఆత్మయొక్క సత్‌స్వరూపమునకు మఱియొక పేరు. దీనినే మనము సాధారణముగా 'సత్' అని అందుము.

'భువః' - అనఁగా పరబ్రహ్మముకంటె వేఱుగాని ఆత్మ యొక్క చిత్ స్వరూపము. దీనినే మనము సాధారణముగా 'చిత్' అని అందుము.

'సర్వవస్తువులను జ్ఞేయవస్తువులుగా ప్రకాశింపఁజేయు చిత్ స్వరూపము' అని ఇక్కడ వ్యుత్పత్త్యర్థము.

'సువః (సువర్)' - అనఁగా బాగుగా నెల్లరచేతను కోరఁబడునట్టి (పరబ్రహ్మముకంటె వేఱుగాని ఆత్మయొక్క) నిరతిశయానంద స్వరూపము. దీనినే సాధారణముగా 'ఆనందము' లేక 'సుఖము' అని పరబ్రహ్మముయొక్క స్వరూపమును 'సచ్చిదానందరూప'మని లేక 'సచ్చిత్సుఖరూప'మని నిర్దేశించునపుడు చెప్పదుము. 'అందరిచే బాగుగా వరణీయమైన ఆనందరూప'మని ఇక్కడ వ్యుత్పత్త్యర్థము.

'మహః' - అనఁగా పరబ్రహ్మము కంటె వేఱుగాని ఆత్మ యొక్క పరమపూజ్యమైన సర్వోత్కృష్టమైన స్వరూపమే అని తెలియవలెను. ఇక్కడ 'పరమ పూజ్యమైన స్వరూప'మని వ్యుత్పత్త్యర్థము.

'జనః' - అనఁగా పరబ్రహ్మముకంటె వేఱుగాని ఆత్మయొక్క వివర్త సర్వకారణ స్వరూపమని తెలియవలెను - అనఁగా కల్పిత దృష్టిలో పరమేశ్వరుఁడుగా నంతర్యామిగా సర్వప్రేరకత్వము, సర్వసృజనత్వము గలిగియున్న పరబ్రహ్మము కంటె వేఱుగాని ఆత్మయొక్క కారణస్వరూపమని యర్థము.

'తపః' - అనఁగా సర్వజ్ఞత్వముగల 'చిత్' అనఁగా జ్ఞానరూపములోనున్న పరబ్రహ్మము కంటె వేఱుగాని ఆత్మయొక్క తేజోరూపము. ఇక్కడ 'తపస్స' నఁగా జ్ఞానమే యని శాస్త్రీయమైన యర్థము - 'యస్య జ్ఞానమయం తపః' అని ఉపనిషద్వాక్యము.

'సత్యమ్' - అనఁగా పరబ్రహ్మము కంటె వేఱుగాని ఆత్మయొక్క త్రికాలాబాధిత స్వరూపము - అంటే భూతభవిష్యద్వర్తమానములను మూఁడు కాలములలోఁ గూడా నాశనముగాని, మార్పుగాని లేక యుండునట్టి పరబ్రహ్మముకంటె వేఱుగాని ఆత్మయొక్క శాశ్వతస్వరూపము. ఈ విధముగా నీ వ్యాహృతు లన్నియుఁ బరబ్రహ్మము కంటె వేఱుగాని ఆత్మయొక్క సచ్చిదానంద స్వరూపమునే సూచించుచున్నవి. దీనిని బట్టి మనము

తెలిసికొనవలసిన దేమనఁగా - "ప్రతివ్యాహృతికి మొదటఁజెప్పఁబడిన ఓంకారముచేత సూచింపఁబడునది ఆత్మకంటె వేఱుగాని పరబ్రహ్మమే కాని వేఱుగాదు: అందుకే ఓంకారము తర్వాత చెప్పఁబడిన ప్రతివ్యాహృతియు పరబ్రహ్మము కంటె వేఱుగాని ఆత్మయొక్క సచ్చిదానంద స్వరూపమునే సూచించుచున్నవి" అని తెలియవలెను.

అయితే ఒక సందేహ మిక్కడ పాఠక మహాశయులకుఁగలుగ వచ్చును. ఏమంటే - "ఏమండి, మీరు వ్యాహృతుల కొక్కొక్క దానికీ ఒక్కొక్క అర్థము చెప్పారు, బాగానే ఉన్నది గాని, వ్యాహృతు లేడున్నూ ఏడు లోకాలను సూచించుట లేదా? మఱి ఆ సంగతి మీ రెందుకు ప్రస్తావనలోనికి తేకుండా ఉన్నారు?" అన్నదే ఈ సందేహం.

దీనికి సమాధాన మేమంటే - 'నిజమే - మీరు చెప్పినట్లు పైనఁజెప్ప కొన్న ఏడు వ్యాహృతులూ కూడా 'భూలోకము' , 'భువర్లోకము', 'సువర్లోకము' లేక 'స్వర్లోకము' అనఁగా స్వర్గలోకము - 'మహర్లోకము', 'జనోలోకము', 'తపోలోకము', 'సత్యలోకము' అనఁబడు నూర్ధ్వలోకము లేడింటికి పేర్లు. అయితే ఇక్కడ తెలిసికొనవలసిన దేమంటే ఆ ఏడులోకాలూ కూడా ఒకే పరబ్రహ్మముయొక్క అనఁగా నాత్మకంటె వేఱుగాని పరబ్రహ్మము యొక్క యేడు కల్పితరూపాలు - యథార్థదృష్టిలో లేక పారలౌకిక దృష్టిలో అవి ఆత్మకంటె వేఱుకాని పరబ్రహ్మమునకు భిన్నములు కావు. నిజానికి పరబ్రహ్మముకంటె వేఱు పదార్థ మెక్కడా లేదు. ఈ సంగతే యీ యేడు వ్యహృతులకుఁబైన వివరించిన యేడర్థములూ బోధించుచున్నవి" - అని తెలియవలెను.

"ఇఁక 'గాయత్రీశిరస్సు' అన్నారు కదా, దాని అర్థమేమిటి?" అని పాఠకమహాశయులు ప్రశ్నింపఁదలఁచినచో నా యర్థ మిప్పుడు వివరింపఁబ డుచున్నది.

## 10. క) భాష్యము :

గాయత్రీ శిరసః అపి అయమేవ అర్థః । - ఆపః ఇతి ఆప్నోతీతి వ్యుత్పత్త్యా వ్యపకత్వ ముచ్యతే । జ్యోతిః ఇతి ప్రకాశరూపత్వం (కాశ్-దీప్తౌ)।

రసః ఇతి సర్వాతిశయత్వం । అమృతమ్ ఇతి మరణాది సంసార నిర్ముక్తత్వం । సర్వవ్యాపి సర్వప్రకాశకత్వం సర్వోత్కృష్ట నిత్యముక్తత్వం ఆత్మరూపం సచ్చిదానన్దాత్మకం యదోంకారవాచ్యం బ్రహ్మ తదహ మస్మీతి గాయత్రీ మన్త్రస్య అర్థః.

ఖ) వివరణము :

మనము 'గాయత్రీ శిరస్సు'ను గూర్చి యింతవఱకూ జరిగిన వివరణ ములోఁ బ్రస్తావించుకొన్నాము. దాని నీ క్రిందివిధముగా గుర్తింపవలెను.

'గాయత్రీ శిరస్సు' - (అనఁగా శ్రీ గాయత్రీ మహామంత్రము నందు చతుర్థపాదము).

ఆపో జ్యోతీ రసోఽమృతం

ఈ 'గాయత్రీ శిరస్సు' యొక్క ప్రతిపదార్థ మిప్పుడు చెప్పఁబడుచున్నది.

ఆపో (ఆపః) - అనఁగా ప్రత్యగభిన్న పరబ్రహ్మముయొక్క అంటే ఆత్మకంటే వేఱుగాని పరబ్రహ్మముయొక్క సర్వవ్యాపక స్వరూపము. ఇక్కడ 'నంతట వ్యాపించునది' యని వ్యుత్పత్త్యర్థము.

'జ్యోతిః' - అనఁగా ప్రత్యగభిన్న పరబ్రహ్మముయొక్క ప్రకాశస్వరూ పము. ఇక్కడ 'తేజోరూపము' అని ప్రధానార్థము.

'రసః' - అనఁగా ప్రత్యగభిన్న పరబ్రహ్మముయొక్క సర్వాతిశయ రూపము - అంటే సర్వోత్కృష్ట రూపమని యర్థము.

'అమృతమ్' - అనఁగా జననమరణములు, మొదలగు సంసారబంధ కారణములు లేని ప్రత్యగభిన్న పరబ్రహ్మము యొక్క నిత్యము క్తస్వరూపమని యర్థము.

ఈ విధముగాఁ జూచుకొన్నచో - సర్వవ్యాపకత్వమూ, సర్వప్రకాశ కత్వమూ, సర్వోత్కృష్ట నిత్యముక్త స్వరూపమూ, ప్రత్యగభిన్నత్వమూ,

సచ్చిదానందస్వరూపమూ, గలిగి 'ప్రణవము' అనఁగా నోంకారముచే చెప్పఁబ డుచున్న పరబ్రహ్మమే నే నను జ్ఞానముతో నిదిధ్యాసనము చేయుటే లేక సూచనప్రాయముగా నట్లు తెలిసి యట్టి జ్ఞానము దృఢముగా తెలియఁబడు టకు లేక కాలాంతర ముక్తి కొఱకు నుపాసనాదులు నెఱపుటే శ్రీగాయత్రీ మహామంత్రము యొక్క పరమరహస్యమూ, పరమ ప్రయోజనకరమైనట్టియూ అర్థమై యున్నది.

ఇఁక నుపసంహారముగా శ్రీ గాయత్రీ మహామంత్రము యొక్క ముఖ్య సందేశము మఱల వివరముగా చెప్పఁబడుచున్నది. ఇక్కడ నతిసూక్ష్మ విషయము చెప్పఁబడుచున్నది గాన 'పునరావృత్తి' అనఁగా 'చెప్పినదే మఱల చెప్పుట' దోషము గాదని మనవి. అంతేగాక నుపక్రమోపసంహార లింగలక్షణము గూడ నిట్టి పునరావృత్తి నామోదించును.

11. క) భాష్యము :

గుహాశయే, బ్రహ్మ హుతాశనే, అహంకర్తృిద మంశాఖ్య హవిఃహుతం సత్ । విలీయతే న ఇదమ్ అహం భవాన్ ఇతి ఏషః ప్రకారః తు అభిధీయతే అత్ర ॥ య దస్తి యద్భాతి తదాత్మ రూపం, న అన్యత్ తతః భాతి, న చ అన్యదస్తి । స్వభావ సంవిత్ ప్రతిభాతి కేవలా, గ్రాహ్యం గ్రహీతా ఇతి మృషా ఏవ కల్పనా.

ఖ) వివరణము :

ఈ భాష్యము యొక్క వివరణము లన్నిఁటిలో మనము చెప్పుకొనిన యర్థములను బట్టి శ్రీ గాయత్రీ మహామంత్రము యొక్క ముఖ్య సందేశ మే మని తేలుచున్నదనఁగా:

1. 'జీవన్ముక్తి పరులకు' లేక 'సద్యోముక్తి పరులకు' సందేశము:

"మన బుద్ధిగుహలో దాఁగిన ప్రత్యగభిన్న బ్రహ్మమనెడి యగ్నిలో 'నహంకారము' అనఁగా 'నేను చేయుచున్నాను అను భావము,' మఱియు 'నిదం బుద్ధి' అనగా 'నిది నాచేత చూడఁబడుచున్నది లేక వినియోగింపఁ

బడుచున్నది అను భావము' యనెడి రెంటిని హవిస్సులను చేసి వ్రేల్చినచో నట్టి యజ్ఞాగ్నిలోఁబడి 'నేను' లేక 'నీవు' అను భావము 'ఆత్మ' లేక 'బ్రహ్మ' వస్తువులో విలీనమై 'నిత్యముక్తత్వము' లేక 'జీవన్ముక్తి' సంప్రాప్తమగును' - అని తెలియవలెను.

## 2. 'ఉపాసనాపరులకు' లేక 'కాలాంతర క్రమముక్తి పరులకు' సందేశము

"చూచెడివాఁడు, చూడఁబడెడిది, లేక గ్రహించువాఁడు, గ్రహింపఁబడునది, అను ద్వైతముగలిగి యున్న యీ దృశ్యప్రపంచము నేను గాదు, నే నేకైక దృక్ పదార్థమైన పరబ్రహ్మముకంటె వేఱుగానని సూచనప్రాయముగాఁదెలిసికొని 'అహం గ్రహోపాసన; చేసినచో నయ్యది కాలాంతర క్రమముక్తి సాధకమగును" - అని తెలియవలెను.

## 3. సర్వులకు సామాన్య సందేశము :

ముఖ్యముగా 'అస్తి' అనఁగా 'ఉండుట' అను గుణము, 'భాతి' అనఁగా ప్రకాశించుట లేక జ్ఞేయవస్తువుగా నుండుట, అను గుణము కలిగి యీ ప్రపంచము భాసించుచున్నది. సాంకేతిక శబ్దములతోఁజెప్పుకొన్నచో నీ రెండు గుణములను గలిపి 'సచ్చిదంశ' లని యందురు. సచ్చిదంశలతోఁగూడినదే ప్రపంచము. నిజానికి 'సత్' కూడా ఆత్మస్వరూపమే, 'చిత్' కూడా ఆత్మస్వరూపమే. అందుచేత నీ ప్రపంచమంతా సచ్చిదానంద స్వరూపమైన ప్రత్యగభిన్న పరబ్రహ్మముకంటె వేఱు గాదు. వేఱుగా కనిపిస్తే అది 'భ్రాన్తి' లేక 'కల్పన' లేక 'కల' మాత్రమే యగును. ఈ ప్రత్యగభిన్న పరబ్రహ్మముకంటె వేఱైనపదార్థ మెక్కడను ప్రకాశించుటలేదు. అసలటువంటి పదార్థ మెక్కాడా కన్పించదు. అందుచేతనే కేవల చిత్స్వరూపమైన ఆత్మస్వరూప మీ విధముగాఁ గల్పిత ప్రపంచమందలి వ్యవహారమున "గ్రహితా= గ్రహించువాఁడు", మఱియు "గ్రహీతం= గ్రహింపఁబడునది" కేవలము అబద్ధములు, నిజములు కావు అని తెలిసికొనవలయును.

* * *

ఓమ్ శ్రీరామ

# చంద్రికా స్నానం

"ఐతిహాసిక పరిశోధనా గ్రంథ రచయితలు,
సుమనోజ్ఞ - సుమధుర కవితా వతంసులు,
సహృదయులు, రసజ్ఞులు"

## శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు

లోకంలో ఇన్ని అల్ల కల్లోలాలు, వైపరీత్యాలు, నాస్తికత, హింస, ప్రతి హింస, ద్వేషము, నేరప్రవృత్తి ప్రబలడానికి కారణ మేమిటి?

భగవదాజ్ఞలను మానవులు పాటించకపోవడమే। భగవదాజ్ఞలు ఏవి? అవే గీతా వచనాలు

గీతను పఠించేవారు, పఠించిన విషయాన్ని ఆచరించేవారు, ఆచరించిన వారిని ఆదర్శంగా చేసుకొని అనుసరించేవారు ఉన్నట్లయితే లోకంలో శాంతి సౌఖ్యాలు నెలకొంటాయి శాంతిసౌఖ్యాలు భగవంతుని పాదారవిందాల నుంచి రాదగినవేకాని ప్రభుత్వాల మూలంగా వచ్చేవి కావు.

పరబ్రహ్మ పురుషోత్తముడయిన శ్రీకృష్ణభగవానుడు స్థాన విచ్యుతమైన జగద్రథనేమిని సువ్యస్థితం చేసి, అనేకత్వంలో ఏకత్వాన్ని, భిన్నభిన్న రూపాలలో ఏకైక మూల స్వరూపాన్ని దర్శించే మహా భాగ్యాన్ని మానవ కోటికి ప్రసాదించాడు.

సర్వోద్ధార ప్రయత్నంతో ఆవిర్భవించినవాడు శ్రీకృష్ణభగవానుడు. కృష్ణుడు - వేదవ్యాసుడు, కృష్ణుడు - అర్జునుడు, తాను శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించి గీతను ఉపదేశించి, సమస్తజీవసముద్ధరణకు దాన్ని లోకంలో ప్రశస్తం చేయించాడు.

శ్రీకృష్ణుని వాఙ్మయమూర్తియే ఈ గీత. ఇలాంటి పరమ పవిత్రమైన గ్రంథాన్ని పఠించకుండా, ఆచరించకుండా మనం మానవత్వాన్ని ఎలా పొందగలం? మన ధ్యేయమైన పరమపదాన్ని ఎలా చేరుకోగలం?